ఓం నమశ్శివాయనమః

శ్రీ కాళహస్తీశ్వరస్వామివారి

# అష్టోత్తరశతనామావళి



ఓం శివాయ నమః
ఓం మహేశ్వరాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం రుద్రాయ నమః
ఓం విష్ణుపితామహనాయనమః
ఓం సర్వభృతే నమః
ఓం దివ్యకైలాసశిఖరేంద్ర
నివాసభువే నమః
ఓం అఖండబిల్వాచ్ఛదన
ప్రియాయ నమః
ఓం లూతార్తిమోక్షకాయ నమః
ఓం సంసారవైద్యాయ నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం పరమాత్మనే నమః
ఓం పరాత్పరాయ నమః
ఓం కాళేభాజంజపధ్వంసినే
నమః

ఓం సీతాభ్రసలిలాహూతాయ నమః
ఓం తేజోనిధయే నమః
జగద్యోనయే
దివ్యమంగళవిగ్రహాయ
అనేకకోటిబ్రహ్మాండ
పిండీకరణపండితాయ
పంచబ్రహ్మాతనదే
సర్వమంగళాలంకృతాకృతయే
అనాదివిధనాయ
శంభవే
సచ్చిదానందరూపధృతే
హిరణ్యగర్భజనకాయ
జ్ఞానప్రసూనాంబికాపతియే
మయూరార్తిపహర్త్రే
దాయామోహనిబర్హణాయ
వేదాంతవేద్యాయ
కాలాత్మనేయ

ఓం విచిత్రబహుశక్తిమాతే నమః
స్థిరధ్వనినే
పశుపతే
సర్వతత్త్వప్రబోధకాయ
శంకరాభయదాయ
గౌరాయ
శంభరేక్షణభూషితాయ
సువర్ణముఖరీతీరవాసినే
విజయముక్తిదాయ
అగస్త్యాయ రమేశాది సురోపాస్యత్వదాయకాయ
వైదికాగమపీఠస్థాయ
మనిజలార్చనప్రియామని కర్ణాయ
హరిబ్రహ్మదష్టపాద శిరవే
స్యభవే
మృడాయ
పంచాక్షరకారాయ
దుర్గాహేమరుచిప్రదాయ
అనంతకల్యాణగుణాయ
నీలాకైవల్యకారణాయ
లింగోద్భవాయ

ఓం విద్యారాశయే నమః
విద్యాపతయే
అనాయమాయ
పంచాక్షరాభిధేయా
శుభగాశోకభంజనా
చంద్రదక్షయహర్త్రే
అర్కమహాపాపాబ్ధి
శేషకాయ
ఆనందతాండవకకాయ
సకలామరణాయకాయ
దుర్గాయ
దర్గాసమారాధ్యాయ
చక్రప్రస్తుతవైభవాయ
నేత్రే
హరహరోద్దర్త్రే
శక్రకిల్బిషమార్జకాయ
స్కందసర్వజ్ఞతాహేతవే
పంచతాభిన్నమస్తకాయ
లక్ష్మీవినుతవామాంఘ్రయే
జపాలభక్తిగోచరాయ
మూకమృత్యుంజయాయ
యాత్రిఘ్నాయ

ఓంవృద్ధబ్రాహ్మణవేషభృతేనమః
మాయాశివద్విజాకారాయ
నారదామోదదాయకాయ
నిత్యాయ
మార్కండేయహృదంతస్థ-
మహాసంశయ
వేదకాయ
సనత్కుమారశుకపరాశరా-
సుబుసీతాయ
విజ్ఞాతదేవలోకోరుశక్తయశవ-
పుర్దరాయనసహస్తదేవా-
సంవద్యాయ
పిలకంతామలాపసుదీన-
పద్మశేవకరాజేంద్రాయ
కన్యాయుగళసేవితాయ,
తుంగాయ
రక్షితసారంగాయ

ఓం ధృతచక్రధరాయ నమః
విభవే
ధర్మాసనాయ
వరగుణాభీప్సితార్థప్రదాయ-
కాయ
నిత్యాయ
బ్రహ్మపురావాసినే
దేవర్షినగరాసికాయ
శ్రీవిష్ణునగరావాసినే
శ్రీమత్పాండ్యపురస్థి
భీమార్జితాయ
ప్రీత్రే
భక్తభరద్వాజప్రముఖార్చితాయ
ప్రసన్నకాళహస్తికాయ
ప్రభాజ్యోతితదిక్ప్రాకుమార-
కాళహస్తిఈశాయ
గోవిందనయనార్చితాయనమః

ఇతి శ్రీ కాళహస్తీశ్వర శతనామావళి సంపూర్ణం.



ఓం నమశ్శివాయః

# శ్రీ కాళహస్తి
# క్షేత్ర మహాత్మ్యము

[ వచన కావ్యము ]



జి. వెంకట్రామయ్య,

పటముల వ్యాపారము, సన్నిధి వీధి, కాళహస్తి.

 1960 వెల 0-8-0

ఓం నమశ్శివాయః

# విన్నపము.

శ్రీ భక్తాగ్రేశ్వరులకు నాయొక్క వందనములు.

ఆర్యులారా :

శ్రీ కాళహస్తి క్షేత్రమహాత్మ్యమును శ్రీ శ్రీ ధూర్జటి కవి గారు సంస్కృతములో పైగ్రంథమును రచించియున్నారు. యీ గ్రంథమును పరిశీలించిన పెద్దలు యీ మహాత్మ్యమును చెప్పగా అందులో కొన్ని విషయములు గ్రహించియు, కాళహస్తి క్షేత్రములో నివసించు పెద్దలు ఆలయములోని విగ్రహములను గురించియు, తీర్థముల గురించియు చెప్పగా వినియు, సదరు విగ్రహములను, తీర్థములను నేరులో చూచియు, కొన్ని గ్రంథములను పరిశీలించియు, స్వానుభవముతో నీ గ్రంథమును భక్తితో రచియింప దొడంగితిని. ఇందేదైన తప్పొప్పులున్న పాఠకులు మన్నింతురని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
శ్రీ శంకర్ సాధు సత్యానందయోగి
శ్రీ రామానంద ఆశ్రమము,
తిరునల్వేలి, తమిళ్‌నాడు.

ఓం నమ్శ్శివాయః

శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరస్వామినే నమః

## శ్లోకములు :

శుద్ధిక్షేమ శివాపేక్షీ సువర్ణముఖరీం శుభాం
అగస్త్యాచల సంభూతాంతర్వ్యోదధిగామినీం
సమస్తపాపహంత్రీత్వా మహంస్నాతుం సమాశ్రయే
మహాపాతక సంపుష్టం గాత్రంమమ శుభోధకైః
క్షాళయామి జగద్ధాత్రీ శ్రేయసాపూర్వయస్యయామ్ ॥

శ్రీ=సాలెపురుగు ; కాళ=సర్పము ; హస్తి=ఏనుగు.

శ్యామాంరాజ నిభాననా రతిహితాం రాజీవపత్రీక్షణాం
రాజత్కాంచన రత్నభూషణయుతాం రాజ్యప్రదానీశ్వరీం
రక్షో గర్వనివారణాం త్రిజగతాం రక్షైక చింతామణీం
ధ్యాయేచేతసీ కాళహస్తి నిలయాం జ్ఞానప్రసూనాంబికాం ॥

భావాతీత మనః ప్రభావ భరితాం బహ్మాండభాండోదరీం
బాలాం బాలతురంగా నేత్రయుగళాం భానుప్రభా భాసితాం
భాస్వతేత్రరుచాభిరామ నిలయాం భవ్యాం భవానీం శివాం
ధ్యాయేచేతసీ కాళహస్తినిలయాం జ్ఞానప్రసూనాంబికాం ॥



శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరస్వామివారి దేవస్థానములో ముఖ్యముగా చూడదగిన దేవతలు.

పెద్దలు నిర్ణయించిన నామధేయంబులు.

1 విఘ్నేశ్వరుడు
2 అప్పరమూర్తి
3 సుందరమూర్తి
4 మాణిక్యమూర్తి
5 సమందర్ మూర్తి
6 సరస్వతీర్థము
7 సుబ్రహ్మణ్యస్వామి
8 ఉత్సవమూర్తులు
9 ధ్వజస్తంభము
10 శ్రీ కాళహస్తి ఈశ్వరస్వామి
11 సూర్యభగవానుడు
12 కనకదుర్గాదేవి
13 చతుర్ముఖ బ్రహ్మ
14 అరుణాచలేశ్వరుడు
15 హోమగుండము
16 దక్షిణామూర్తి
17 మోక్షగణపతి
18 నందీశ్వరుడు
19 సుబ్రహ్మణ్యస్వామి
20 కాశిలింగము
21 రామేశ్వరలింగము
22 శ్రీ భక్తకన్నప్ప
23 విఘ్నేశ్వరుడు
24 విజయనగర మహారాజులు పూజచేసిన లింగములు
26 తిరుపతి వెంకటేశ్వరులు
27 వీరరాఘవస్వామి
28 రామలింగస్వామి
29 సీతాదేవి లింగం
30 లక్ష్మణస్వామి లింగం
31 శ్రీరాములవారి లింగం
32 పరశురాముని లింగం
33 శనేశ్వరస్వామి
34 సప్తఋషులు పూజ చేసిన లింగములు

35 భూతవినాయకుడు
36 దుర్గాదేవి
37 నగరాజస్వామి
38 అరవై ముగ్గురుభక్తులు-
39 సాలెపురుగు (వరుస)
40 సర్పము
41 ఏనుగు
42 భీముడు
43 అర్జునుడు
44 నకులుడు
45 సహదేవుడు
46 ధర్మరాజులు
47 ద్రౌపదీదేవి
48 లక్ష్మి
49 సరస్వతి
50 పార్వతి
51 మార్కండేయ లింగం
52 సప్తరుషులు (వెనుక)
53 కాళభైరవుడు
54 భట్టల భైరవుడు
55 దేవకన్యకలు
56 నాగకన్యకలు
57 యాగశాల
58 యమరాక్షలు
59 పైన చిత్రకూటం
60 పైన పద్మము
61 శ్రీ పార్వతీదేవి
62 ప్రదక్షణము
63 తీర్థము తొట్టి
64 స్వామి అమ్మవార్లు
65 పాన్పుశేవ
66 పార్వతీ హుండీ
67 పైనఉండు
68 చిత్రగుప్తుని లింగం
69 యమధర్మరాజు లింగం
70 ధర్మరాజు లింగం
71 అమ్మవారు శిఖరము
72 కైలాసగిరి పర్వతము
73 స్వామి శిఖరము
74 సహస్రలింగేశ్వరుడు
75 1008 లింగములు
76 స్వామివారి వాహనము
77 అమ్మవారి వాహనము
78 అక్కన్నగారు లింగం
79 మాదన్నగారు లింగం
80 ప్రసన్న ఈశ్వరుడు

81 అభ్ర లింగం
82 వాయువు లింగం
83 ఆకాశ లింగం
84 పృథివి లింగం
85 తేజో లింగములు
86 రామలింగయ్య లింగం
87 కాళిదాసుగారి లింగం
88 చోళరాజులవారు పూజచేసిన లింగములు
89 స్పటికలింగం
90 యమదూతలు
91 మృత్యుంజయ లింగం
92 దక్షిణామూర్తి
93 నందీశ్వరుడు

ఈ క్షేత్రములోయుండు లింగములన్నియు కృతయుగములో, కొన్ని త్రేతాయుగములో, కొన్ని ద్వాపరయుగములో కొన్ని వారి వారి నామదేయంబులచే ఒక్కొక్క లింగమును వారి వారి పేరుతో ప్రతిష్ఠచేసిన లింగములని ఇక్కడవుండుపెద్దలు చెప్పియున్నారు చెప్పుచున్నారు.



ఓం నమశ్శివాయః

శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీకాళహస్తీశ్వర స్వామినే నమః

# శ్రీ కాళహస్తి క్షేత్రమహాత్మ్యము.

శ్రీ మదఖండ నిత్యానంద స్వరూపుడగు శ్రీ విరూపాక్షుని కృపాకటాక్షంబుచే ప్రపంచమంతటిని సృష్టించి, శక్తిని బొంది యున్న మహాదేవుడగు శ్రీ బ్రహ్మదేవుడు సరస్వతి సమేతుడై దేవతలతో కొలువునందుండగా మునులు బ్రహ్మదేవుని దర్శించి, సాష్టాంగ నమస్కారముచేసి బహువిధముల స్తుతించిరి. అప్పుడు బ్రహ్మ వారిని యుచితరీతిని సన్మానించి, మహర్షులారా ! మీ కోర్కెలెవ్వియో వివరింపుడని యడిగెను. అప్పుడు మునులు స్వామీ ! మేము ఈశ్వరునిగురించి ఘోరతపముచేయ నుద్దేశించి యిటకు వచ్చియున్నారము. ఆ తపంబెట్టి విఘ్నములులేక నెఱ వేరుట కొరకు పుణ్యస్థలంబును మాకు దయచేయుమని వేడు కొనిరి. అందులకు బ్రహ్మ బ్రహ్మానందభరితుడై హృదయమున శివుని ధ్యానించి, యొక దర్భపోచను చక్రముగాచేసి భూమిపై వేసెను. మునులను గాంచి మునులారా ! ఈ చక్రము యెచ్చ టెచ్చట నిలచునో ఆ చోటున మీరు తపంబాచరించుటకు యోగ్య మైనవని నుడివెను. ఆ చక్రము లింగస్వరూపముగా, మారి భూ లోకమున ఐదుస్థలములలో నిలచి అంతర్ధానమయ్యెను. మునులు ఈ ఐదు స్థలములలోను తపములు, యజ్ఞయాగాదులు గావించు

చుండిరి. ఆ స్థలములే ఐదు క్షేత్రములుగా మారి, ప్రస్తుతము పంచ భూతములుగా పరిగణింపబడుచున్నవి. అవి యేవనగా :

ఓం పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్ ॥

పృథ్వీ = మన్ను (భూమి) ; అప్పు = జలము (నీరు) ; తేజస్సు = అగ్ని ; వాయువు = గాలి ; ఆకాశము = మేఘము.

(1) పృథ్వీలింగము . ఈ లింగము ఏకాంబరేశ్వరస్వామి యను పేరున కాంచీపురమను గ్రామమున గలదు.

(2) అప్పులింగము : జంబుకేశ్వరమను గ్రామమున జలకంఠేశ్వరస్వామి యను పేరుతో ఈ లింగము జలమునందు గలదు.

(3) తేజో లింగము : ఈ లింగము శ్రీ అణ్ణామలేశ్వరుడను పేరున తిరువణ్ణామలై అను గ్రామమునందు యున్నది.

(4) వాయులింగము : ఈ లింగము శ్రీ కాళహస్తి క్షేత్రమున శ్రీ కాళహస్తి ఈశ్వరుడను నామముతో (స్వయంభు వాయు లింగము) సువర్ణముఖి నదీతీరమున గలదు.

(5) ఆకాశలింగము : ఈ లింగము చిదంబరమునందు శ్రీ నటరాజేశ్వరస్వామి యను పేరుతో వెలసియున్నది.

ఈ పంచ లింగములు ఐదు క్షేత్రములలోయుండి భక్తుల మొరల నాలకించి, వారికి దర్శనమిచ్చి, వారివారి కోర్కెలను యీడేర్చుచున్నారు. వాయులింగముతోకూడిన యీ కాళహస్తి క్షేత్రము దక్షిణ కైలాసమనియు చెప్పుదురు. శ్రీ పార్వతిదేవి

జ్ఞానప్రసూనాంబ యనుపేరుతో వెలసి, తన్ను కొలిచిన భక్తులకు జ్ఞానము, ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి కాపాడుచున్నది.

## స్వర్ణముఖీనది

పూర్వకాలంబున నయ్యగస్త్యుడు శంకరునకు మొక్కి నోరు గప్పికొని యొకయోరనిలచి కరుణానిధి ఇన్నికోట్ల దేవతులు మొదలగువారు శంకరుని పెండ్లి వేడుకనుచూడ పోవుచుండి పున్యమును పొందుచుండా, దాసుండ అగు నేనుమాత్రం దర్శింపక యున్నాను స్వామి అని నీవు సహ్యాసిరికై దక్షిణాభిముకుండవై పోవునపుడు ఏ యే చోట్ల మా కల్యాణశేవను దర్శింపనీ విచ్చగొని యెవదో యచ్చుచట్టునా శేవను నీ కిచ్చెదము అని నా యగస్త్యమహర్షి, కరుణానిది, విష్ణువు మొదలగుదేవతులు లెక్కింపరాని బోనంబులు సమీపమునుండ కుక్కకును నీచుండనగు నన్ను కృతార్థునిజేయ నిశ్చయించి నాయందుంచిన కృపావిశేషంబుచే దేవరవారి దయాసాగరంబుచేముగించెను అని శెలవునొంది తన భార్యయగు లోపముద్రను పిలచుకొని యాత్రలు అనగా క్షేదారము కాశి, విరూపాక్షము, ద్రాక్షారామము నందిపర్వతము మొదలగు స్థలంబులను దర్శనముచేసి వచ్చునప్పుడు, దక్షిణకైలాసంబును గని దర్శనముచేసి ఆనందభరితుడై గోపుంగవి అతిశీఘ్రంబున గ్రేష్మరుతు లేదూడవలె నాగలింగ బ్రహ్మము సన్నిధిబొంది మనస్సు వెన్నవలె గరిగి నేత్రంబుల ఆనందబాష్పములు వెల్లి

వశై పార పులకాంకిత గాత్రుండై కేర్దోయని వంటరిగా సిరంబుపై పరవసుండై నిలచి కొంతవరకు దెలిన బహువిధంబుల, స్మృతించి, దక్షిణామూర్తి పంచశక్తి వినాయకుడు, కుమారస్వామి, జ్ఞాన ప్రసూనాంబా మొదలగు మూర్తులు దర్శనముచేసి బహువారంబులు దుర్గకొండపైకెక్కి యా దేవిని దర్శనముచేసి రావలయును పిదప నా స్థళంబునవెలసిన బహువిదాతిశయంబులనుగని మిగుల సంతోషంబునొంది యాస్థళంబున నదియొక్కటిలేకున్నది యాకొర తను తీర్చివేసెదనని దిటవుకొని యాక్షేత్రంబున నివసించియుండు మునిపుంగవులకడకుయేగి మహాత్ములారా ! ఈ క్షేత్రంబున నది ఒక్కటి ప్రవహింపజేయు శక్తినొసంగుడని వారిని ప్రార్థనచేసి. వారి పూర్ణకటాక్షమువొంది యాస్థళమునకు నాలుగు యోజనముల దూరమున నిబూతి మూలనుండు నొకకొండపైకిపోయి యాచా దులు ఒకగ్రీష్మసమయంబున పంచాగ్నిమధ్యను వానకాలమున, మంచుకాలమున గొంతులోతునీటిలోనుండి పంచేంద్రియంబుల ధ్యావించి సర్వలోకశరన్యుడగు శంకరునుద్దేసించి ఘోరతపంబాచ రించుచుండెను.

యా తపమును నెరిగిన దేవేంద్రుడు మొదలగువారు మునీంద్రుని నభిప్రాయమునుజెంది బ్రహ్మదేవుని శరనొంది వతడు తెలిసికొనక కైలాసగిరికేగి నందికేశ్వరు సన్నిధికిపోయి యతని పాదములు పలుమార్లుమ్రొక్కి అతనివద్ద సెలవుతీసుకొని శివసన్నిధికేగి సాష్టాంగనమస్కారములు ఆచరించి అగస్తుని వృత్తాంతమును విన్నవించెను. అపరంజ్యోతి స్వరూపుడగు భక్త

వత్సలింగని నలువా అగస్త్యుడు కైలాసమునకు వచ్చి ఒక్కటి రప్పింప మమ్మునుగూర్చి తపముజేయుచున్నాడు ఆతనికై ఆకాశ గంగను పంపెదను. నీవు ముందుగాపోయి దానిని నిప్పింపుమని యాజ్ఞాపింప బ్రహ్మదేవుడు చిత్తముఅని సెలవొందీ అగస్త్యుడుండు నిలువ మునివరుండు నలువకుసాగి తన ఇష్టముమ నెఱిగించెను.

వెంటనే బ్రహ్మదేవుడు. ఆకాశమునుజూచెను ఆకాశము నుండి గంగ బంగారువన్నెతోమ్రోగుచు వచ్చుటనుగాంచి బూలోకమునకు పొమ్మని బ్రహ్మదేవుడు చెప్పినాడు వెంటనే దానికి నామదేయంబు స్వర్ణముఖి అని వెడలిపోయెను, తరువాత అగస్త్యుడు తపముచేయుటచే నగస్త్యాచెలమను పేరునొందిన యాకొండను బట్టి, వెంకటాచలము, పరస్ను పరశురామేశ్వరమను దానికండను బోయి దక్షిణకైలాసగిరికి, కాళీతిని వెలింగి, అగ్నిదిశకు దిరిగి ఓంకార క్షేత్రమునజేరి సముద్రమున నా నది సంగమించెను. అదిగన్న అగస్త్యమహర్షి యనేకయేండ్లువరకు పుత్ర, భాగ్యంబు లేక బహుతపంబులాచరించి యొకపుత్రుని కనినటుల మిగుల సంతాపమొంది యాకొండనుదిగి భార్యయగు లోపాముద్రతోడ స్నానంబుచేసి యానది తీరంబున అనేక స్వామి లింగములను, స్థాపించికొనుచు నొక పర్వతములో నివసించెను. ఆక్షేత్రముల నుండి మునివరులు అనేకులువచ్చి స్వామికి నమస్కారములుజేసి ముక్తిబొందినతరువాత అగస్త్యుడు వారలంజూచి వేదాంత శిఖా మునులారా! మీ కరుణాకటాక్షమున ఈ నదిని రప్పింపనైతినే

గాని వేరుకాదు. నాదని యపనింద నున్నదే. ఈ యేరు దేవాది దేవుడగు శివపరమాత్మ కరుణాప్రవాహం అగుచేత నిందు స్నాన మాచరించినవారలు, ముక్తినొందుటకు నెట్టి యాక్షేపనములేదు. బ్రహ్మహత్యాది పంచమహాపాతకములు జేసినవారున్ను, ఈ నది యందు మునిగిరేని పాపవిముక్తు లగుదురు. ఇందు స్నానమాచ రించు పసుపక్షాది, జంతువులు సివాస్వరూపమందున్ను, ఇట్టి ప్రబా వంబుగల ఈ నదిలో దినదినమి స్నానమాచరించు భాగ్యంబులు మీరలకు బొందితిరి. అట్టి భాగంబు నాకు లభించక పోయెనేఅని యా నదినిగూర్చి అగస్తుడు అక్కడయుండు మునివరులకు విన్న వించి వారివద్ద సెలవుతీసుకొని, మహా ,సితసహ్యా పర్వతమునకు భార్యా, లోపాముద్రతో వెడలిపోయెను.

తరువాత ఆ నదియే ఈ కలియుగములో దక్షిణకైలాస గిరియను మహాపుణ్యక్షేత్రమైన కాళహస్తిలో ప్రవహించుచున్నది. ఆనదికి కలియుగములో స్వర్ణముఖినది అని నామధేయంబొనర్చిరి. ఈ నదికాళహస్తికి సుమారు యాబైమైయిళ్ళు దూరమునపుట్టి కాళహస్తిమీదుగా సముద్రములో కలియుచున్నది. ఈ నది శ్రీస్వామివారి ఆలయం ప్రక్కనే ప్రవహించుచున్నది. ఇక్కడికి వచ్చు బక్తులు స్వర్ణముఖినది అవగా బంగారునది అనిపేరు. ఈనదితో స్నానముచేసి స్వామిని దర్శనముచేయుదురు. ఈ నది జీవనదిఅని అంటారు ఈనదిలో యెప్పుడు నీరు పారుచుండును. ఈ నదికి ప్రక్కనే రెండుతీర్థములుగలవు. ఒకటి సూర్యపుష్కరణీ తీర్థము, రెండవది చెంద్రపుష్కరణీతీర్థము గలవు. స్వామివారికి

సూర్యపుష్కరిణీతీర్థం అభిషేకముచేయుదురు. సువర్ణముఖినది ప్రకరణము సమాప్తం.

# శ్రీ సాలెపురుగు - మోక్షము

పూర్వకాలంబున బ్రహ్మదేవుండు సృష్టికార్యంబు చేయు చుండ విశ్వకర్మ కంటియందుపుట్టిన మాదవపూరుదనువాడు చాల దుర్మార్గుడు. ఒకనాడు ఆ మాదవపూరుడు బ్రహ్మదేవుని కడకు పోయి, బ్రహ్మను ధిక్కరించి, నేనున్ను మీమాదిరిగా సృష్టించ దలచితినని పలుకగా వెంటనే బ్రహ్మ వానిపై కోపించి, పిలచి నీవు మదాంధకారముచేత నన్ను ధిక్కరించినందులకు సన్నసూలు పోగులను కలిగించు సాలెపురుగువు కమ్మని శపించెను. అంత నా మాదవపూరుడు భయముజెంది చతుర్ముఖునకు నమస్కరించి దేవాదిదేవా! కరుణాకరా! దయామయా! ఆపద్బాంధవా! అనాథరక్షకా! శరణు అని ప్రార్థించగా, భక్తవత్సలుడగు బ్రహ్మ మరల కనికరించి సంతోషముతో వానికి అభయమొసంగెను. స్వర్ణపరిపూర్ణ కృపాసాగరుడు, దయామయుడగు ఆదిశంకరుడు వేంచేసియున్న దక్షిణ కైలాసంబునకు వెళ్ళి శంకరుని పూజింతు వేని, వారి దివ్యచరణారవిందముం చేరగలవని మాధవపూరుని యాశీర్వదించి వెడలిపోయెను.

మాదవపూరుడు పూర్వజన్మ సుకృతఫలముచేత కృతయుగ మున సువర్ణముఖీ నదీతీరమున నొక సాలెపురుగు జన్మమెత్తి,

అనుదినము ఆ నదిలో స్నానమాచరించి, భక్తిశ్రద్ధలతో ఆశ్రిత జనవత్సలుడగు శంకరుని పూజించుచు, ఈశ్వరునిపై సూర్యుని వేడికిరణములు సోకకుండ చేయుటకుగాను తనయందుద్భవించు నూలుపోగులతో ప్రాకార గోపురముల చుట్టును గూడుకట్టుచూ వచ్చెను. దీనిని గాంచిన మహేశ్వరుడు సాలీడుపై కోపగించి, తన నేత్రమునుండి అగ్నిని జ్వలింపజేసి, సాలెపురుగు కట్టిన గూడును దహించివేసెను. మరునాడు ఈ దృశ్యమును గాంచిన సాలెపురుగు దుఃఖించి, "నా స్వామియైన మహాదేవునికి సూర్యుని కిరణముల వేడిమి సోకనీయకుండుటకుగాను నేను కట్టిన గూడును యెవరో దుర్మార్గులు కాల్చియున్నారే" యని విలపించుచు మరల నొక గూడును నిర్మించెను. అదియు నట్లే కాలిపోయెను. ఇట్లు కొన్ని దినములు గడచిన పిదప, యిట్టి చర్యకు పాల్పడిన దెవ్వరో కనుగొనవలయునని తలంచి ఆ సాలెపురుగు దేవాలయములోనే నివసించుచూ పరీక్షించుచుండెను. ఇంతలో నొక వెలుగు గర్భగుడి యందుండి బయలుదేరి, అగ్నిజ్వాలలుగా మారి తాను కట్టినటు వంటి గూడును కాల్చివేసెను. ఈ సంఘటనలన్నియు తిలకించు చుండిన సాలీడు "ఆహా! నా స్వామియేనా: నాపై పగచూపుట. నే గట్టిన ఆలయమంతయు నేలను పోసిన పన్నీరాయెనే! ఇట్లగుటకు నేను పూర్వజన్మమున చేసిన పాపఫలమొ! నే నేదైన తెలియని అపచారములు జేసితినా?. భగవంతునికి నాపై ఆగ్రహము కలుగుటకు కారణమేమైయుండును? ఛీ! భగవత్కటాక్షము లేని ఈ నాజన్మ వ్యర్థమయ్యె నని విలపించుచు, యిక నే నీదేహ ముంచుకొని సాధింపబోవునదేమియు లేదని" తలంచి, గర్భగుడి

నుండి వచ్చిన యా జ్యోతియే శరణ్యమని నమ్మి, యా జ్యోతిలో బడి ప్రాణత్యాగము చేయబోయెను. ఆపద్బాంధవుడగు ఆదిశంకరుడు జ్యోతియందుబడిన ఆ సాలీడుపై దయగొని. ప్రాణత్యాగము నుపసంహరించుకొనునటుల చేసి. ప్రత్యక్షమై భక్తా ! నీ భక్తికి మెచ్చితిని. నీ కోర్కెలెవ్వియో తెలుపుమని సాలెపురుగు నడిగెను. అంతట యా సాలీడు కరుణాకరా ! శంకరా ! భక్తవశంకరా ! శరణు. వేదముల నెరింగి, జప, తప, ధ్యానపరాయణులగు మునీంద్రులతో సమానముగా, నీ పాదారవిందములకు సేవచేయు భాగ్యము నా కొసంగుమని వేడుకొనెను. అందులకు శంకరుడు సమ్మతించి భక్తా ! నీవు నాపాదములచెంత నుండి నన్ను కొల్చుచుండుము. కలియుగమున నీ కీర్తిని, నీ భక్తిని వెల్లడించుచు, నన్ను దర్శింపవచ్చు భక్తులకు, నీ దర్శనమున్ను లభించులాగున వరమిచ్చితి ననుచు ఈశ్వరుడు అంతర్ధానమయ్యెను.

ఇట్లు కొంతకాలము సాలీడు ఈశ్వరుని పూజించుచుయుండి మోక్షము నొందెను. దీనినిబట్టి మనపూర్వులు శ్రీ యనగా సాలెపురుగని శ్రీ కాళహస్తి క్షేత్రములో చెప్పుచున్నారు. సాలెపురుగు ఇప్పటికిని దక్షిణ కైలాసమని ప్రసిద్ధిజెందిన శ్రీ కాళహస్తి క్షేత్రములో ఈశ్వరుని పాదములవద్ద యుంటున్నది.



# కాళ (సర్పము) - మోక్షము

త్రేతాయుగమున లోకరక్షకుడగు శంకరుడు పులిచర్మము. వల్లె, ఆదిశేషుడు మొదలగు సర్పరాజుల ఆభరములుగా ధరించి, జగన్మాతయైన పార్వతీ సమేతుడై, ముక్కోటిదేవతలతో కైలాస పర్వతమున కొలువుదీరియుండగా, తాను ధరించియున్న ఆభరణ ములలో కాళుండను సర్పరాజు నగుపడలేదని కోపించి, కాళుని వేదకిరండని భటుల కాజ్ఞాపించెను. వారు వెదకుటకు వెళ్ళినప్పుడు ఆ కాళ సర్పము సంతోషముతో తన పుత్రికతో నుండెను. భటులు ఈ వార్తను ఈశ్వరునికి తెలుపగా, ఈశ్వరుడు కోపోద్దీపితుడై కాళుని పిలిపించి, ఓరీ! నీవు ఈ లోకమున నుండతగవు. నీవు భూలోకమున సాధారణ సర్పము కమ్మని శాపమిచ్చెను. అంత నా కాళసర్పము భయపడి శంకరుని వేడుకొనగా, శంకరుడు కని కరించి, నీవు దక్షిణ కైలాసమను శ్రీకాళహస్తి క్షేత్రమున జన్మ మెత్తి, మమ్ము పూజించుచుండుము. అప్పుడు నీపై మచ్చరము గొన్న నొక యేనుగు నిన్ను జంపును. పిదప మీరిరువురు శివ సాయుజ్య మొందెదరని శాపవిమోచన మార్గ ముపదేశించెను.

తదుపరి కొంతకాలమునకు కాళసర్పము భూలోకమున కాళహస్తి క్షేత్రమున జన్మించి, సువర్ణముఖి నదియందు స్నాన మాచరించి, యా శివలింగమునకు మణులు, మాణిక్యములు, నవ రత్నములతో పూజలు చేయుచుండగా, సాలెపురుగుకూడ నచ్చో టికి వచ్చి పూజలు చేయుటనుగాంచి, కాళసర్పము సాలెపురుగుతో

సఖ్యమారంభించెను. ఇట్లు యిది రెండును శంకరునికి అభిషేక ములు, నిత్యనైవేద్యములు సక్రమముగా యే లోపములు లేక జరుపుచుండినవి. ఇప్పటికిని శ్రీ స్వామివారి వక్షస్థలమున ఐదు శిరములున్ను, దిగువ పాదములవద్ద సాలెపురుగున్ను గలదు. ఈ రెండున్ను ఈ విధముగా చేరిన తరువాత —

## హస్తి-ఏనుగు

వెండికొండయందొక తీరమున నొకగణనాయకుడు హస్తి యనువాడు. శంకరుని పూజింప ద్వారంబుకడకు రాగా నచ్చట ద్వారపాలకులు నతనిని పూజించి మీరు లోనికి పోకూడదు ఇది సమయంకాదు. ఇప్పుడు పార్వతీ, పరమేశ్వరులు వంటరిగా యున్నారు అని శేవకులుచెప్పగా అందులకు గణనాయకుడు కోపించి లోనికి ప్రవేసించెను. వెంటనే పార్వతీ పరమేశ్వరుడు వానినిజూచి ఓరీ! గణనాయకా! నీవు మా శేవకులను బెదరించి నా ఆజ్ఞమీరి లోనికి ప్రవేసించినావా? నీకు మదము, అహంకార ముచే నీవు ఈ పనిచేసినావు కాన నీకు ఈ శాపమిచ్చెద. నీవు భూలోకములో ఏనుగవై జన్మించుమని శపించెను. అందులకు గణనాయకుడు స్వామీ! ఈశ్వరా! మహానుభావా! నాశాపం విమోచన మార్గం ఇప్పించమని స్వామిని వేడుకొనగా అందులకు శంక రుడు సంతసించి భక్తా నీవు దక్షిణకైలాసమను పుణ్యక్షేత్రం యున్నది నీవుపోయి ఆ శివలింగమునకు పూజించుచుండగా నీకు శాపం విమోచనం గలుగునని స్వామిచెప్పి వెడలిపోయెను.

తరువాత స్వామిచెప్పిన ప్రకారం గణనాయకుడు భూలోకములో ఏనుగు జన్మమెత్తెను తదుపరి ఆఏనుగు దక్షిణ కైలాసమువచ్చి స్వర్ణముఖీనదిలో స్నానమాచరించి తన తొండము నిండుగా నీరుపీల్చుకొని వచ్చి పాము పూజించిన మణులు, రత్నములను రాళ్ళుఅని భావించి దూరముగాపారవేసి, ఏనుగు తెచ్చిన నీరును స్వామికి అభిషేకముచేసి. బిల్వముతెచ్చి స్వామిపై పెట్టి సమర్పణచేసెను. మరుదినం మరలాపామువచ్చి శివలింగసిరమున బిల్వదళంబులను నుండుటగని ఆయ్యో ఇదియేమి అవినీతి. నేనలంకరించిన మణులు, రత్నములను పారవేసి ఈ పనికిమాలిన యాకులను స్వామిపై వేసిరేయని దుఃఖించి ఈ ఆకులను దిగువద్రోసి మానిక్యములను స్వామికి నలంకరించి సంతుష్టితో పాము వెడలిపోయెను. మరుదినం ఏనుగువచ్చి ఈ రాళ్ళనుచూచి అయ్యో స్వామిమీద యెవరో రాళ్ళుపెట్టినారే అని ఏనుగు కోపించి అవి దూరముగా పారవేసి ఇదియేమి విపరీతకాలమోయని, యెవరికో చేటుమూడి ఇటులజేసియున్నాడు లేకున్న ఈపవిత్రములైన బిల్వదళములను దిగువపెట్టి ఈ కొరగానిరాళ్ళు బోయనేలని ఈ రాళ్ళు పోయునపుడు స్వామికి యెంతనొచ్చెనో యని కోపించి యామణులను క్రిందద్రోసి తనుతెచ్చిన నీరును యాలింగమునకు అభిషేకముచేసి బిల్వదళములను నర్పించి తనుదారిని తనుపోయెను. ఆమరునాడు మరలా యధాప్రకారం పామువచ్చిచూచి ఈమారేడు ఆకులను స్వామిపైనవేసిన దుర్మార్గుడెవడు ? ఇట్టి పాపకార్యముల కొడిగట్టినవాడు ఎంతటికివచ్చి ఒడికట్టును. స్వామి అని నేనలంకరించిన మణులను యెత్తినవాడు నా శత్రువేయుండవలయునని

కోపించి ఆ దుర్మార్గుని నేను చంపకమానను అని శపదంచేశెను. నా విషజ్వాలల వానిని నీరుచేయనా అని నా పూజకు భంగము కలిగించినవాడు శివుడు దండింపక పూరకవుండునాయని దండింపక వదలిన ఆ కార్యము శివునికి సమ్మతియగునా మంచిదికానిమ్మని వానిని నెట్లైన రేపటికి కనిపెట్టి తగినశిక్ష విధించకపోకూడదు అని రత్నములను లింగమునకు అలంకరించి తినదారిన పాము పోయెను. మరునాడు ఏనుగువచ్చి రత్నములనుజూచి యసహ్య పడి సిగ్గునొంది తన తొండముచే ఆరాళ్ళను దూరముగా పారవేసి యతికోపముచేత యాలింగమువద్దపడి పొర్లాడుచు తండ్రీ! ఈవిధముగ జరుగుటకు తమకు సమ్మతమేనాస్వామీ! అని ఈ రాళ్ళు మీ తలమీద యెట్లుమోసెదరు స్వామీ! మీకు తలనొప్పియెత్తదా? ఈ రాళ్ళను మీరు పువ్వులని భావించితిరే నా శత్రువునకు మీరు వశమైయుండినయెడల నాకుతోడు యెవ్వరుస్వామీ? అని మీరు నాకు ఒక శత్రువును లోకంబున లేదని పలవించి ఇక జరిగినది పోనీ ఇకమీదట వాడు రాళ్ళను పెట్టుటచూచినచో నేనుసహించను. ప్రతిజ్ఞగొని ఏనుగు వెడలిపోయెను వాడుకమేరకు లింగమునకు పూజించిపోయి ఆ రాత్రిఅంతయు నిద్రలేక యెప్పుడు వచ్చునా యని యెదురు చూచుచుండెను. మరుదినం ఉదయంలేచి స్వామి సన్నిధికివచ్చి శివలింగముపై నుంచియుండు పూగుత్తులనుగని యాపుష్పముల గుత్తులందుదాగి పాము పగవారికి కంటపడకుండా పగవానికై కాచుకొని చూచుచుండును. తరువాత కొంచెం సేపటికి నచ్చటికి ఏనుగువచ్చి నిన్న తాను అలంకరించినవి చెక్కుచెదరక అటులనే యుండుటకు సంతసించి శంకరుడు మనపూజను నేడు

గ్రహించెననియెంచి సాన్నమాచరించి యభిషేక జలములను దెచ్చి స్వామిపైనుండిన పుష్పములను యెత్తిపారవేయ తనతొండమును లింగముపై పెట్టగా పుష్పములలో దాగియున్నసర్పము బుస్సునని కోపముచేత ఏనుగు తొండములో చివాలునదూరి తనసెత్తికెక్కి కరువనారంభించెను. తరువాత ఆ ఏనుగు హా! స్వామీ! మీరు నా కిట్టియాపదచేసితిరేయని ప్రార్థనలు చేయుచుండెను. తరువాత పాము, ఏనుగును బాధపెట్టుచుండెను. ఆ బాధలకు వోర్వలేక పెద్ద ఘీంకారములు పెట్టుచు, నీళ్ళను పీల్చి పీల్చి విసరి విసరి యలసి భూమిపైబడి తన తొండమును భూమికేసి మోది మోది రక్తము కాలువలుగా పారనారంభించెను. చెట్లుపై మోదుకొనినను ఆ బాధ తీరకుండుటంగని ఆ పర్వతములందు ఘీంకారస్వరూపముతో పరుగెత్తి పరుగెత్తి అలసి ఆహా మన శత్రువును జంపి మనము చావవలయునని ఆఏనుగు తన ప్రాణములమీద ఆశవదలి తొండమునందున్న రంధ్రములను మూసుకొని భూమి యదరు నటుల మోదుచుండెను. అప్పటికి బాధలకు ఓర్వలేక కైలాసగిరి పర్వతమునయుండు యొక పెద్దగుండునుజూచి వెనుకకుపోను ముందుకువచ్చి తనతలతో ఢీకొని ఢీకొని తన సిరమును గుల్ల నటుల ఆ పర్వతమునకు కొట్టుచుండెను. ఈ విధముగా, కొంత కాలము తన సిరమును ఈగుండుకు ఢీకొనగా కొంతకాలమునకు ఏనుగు తల పగిలి భూమిమీదపడి స్వామి లింగమువద్ద తనప్రాణములు విడచేను. ఈ తొండములోపలయుండు సర్పము ఈ దెబ్బల. భరించలేక సర్పము నలిగి నలిగి పిప్పయి ఏనుగు తొండములోనే తమ ప్రాణములు వదలెను. ఈ రెండు ప్రాణములు వద

ఐన తరువాత వెంటనే స్వామి ప్రత్యక్షమై సర్పమును, ఏనుగును లేపి ఈ రెండిటికి మోక్షమిచ్చి. వీరిరువురను పిలుచుకొని కైలాసమునకు పోయెను. వారికి స్వామి ప్రత్యక్షమైనప్పుడు వారు స్వామిని స్వామీ! మీకు ఈ క్షేత్రమున మా నామధేయంబుతో మీరు పుట్టవలయునని స్వామివద్ద వరము తీసుకొని కైలాసమునకు స్వామితోగూడా వారున్ను పోయిరి తరువాత పైకనుపరచిన మూడు జంతువులు శ్రీ కాళహస్తి ఈశ్వరస్వామికి ఐక్యంగా చేసుకొని స్వామివారి పాధములవద్ద సాలెపురుగున్ను వక్షస్థలమందు ఏనుగు ధంతములున్ను, పైన ఐదుసిరస్సులుగల పడగయున్ను, కన్నప్ప ఇచ్చియుండు కన్నుతోను శ్రీకాళహస్తీశ్వరుడు కాళహస్తి క్షేత్రములో స్వయంముగా భూమిలోనుండి పుట్టిరి. అందువలన, శ్రీ-అనగా సాలిపురుగు, కాళ-అనగా సర్పము, అస్తి-అనగా ఏనుగు. శ్రీకాళహస్తీశ్వరుడు అని నామధేయమును పెట్టిరి. దీనికి కాళహస్తియని అందురు.

## వాయుపూజ

పూర్వకాలమున పరమాత్మ స్వరూపియగు పరమశివునియందు మొదట ఆకాశము, ఆ యాకాశమువలన వాయువు, ఆ వాయువువలన అగ్నియు, ఆ యగ్నివలన నుదకము, ఆ వుదకమువలన భూమియు పంచభూతములుగా పుట్టెను. వాయువు తాను సకల చరాచర జీవులకును ఆధారముగా నుండదలంచి వేయిశిఖరములచేత వెలుగుచున్న కైలాసగిరి కేగి, అచ్చట పరమేశ్వరునికి

వాసయోగ్యమై, సంతోషకరంబగుటవలన శివానంద నిలయమను శిఖరమునందు తెల్లగా ప్రకాశించుచున్న లింగమును అనేక దినంబులు బిల్వదళములచే నర్చింపగా, ఒకనాడు ఈశ్వరు డా లింగము నందు ప్రత్యక్షమై, వాయువును గాంచి, ఓభక్తా! నీ పూజకును, భక్తికిని మెచ్చి, నీ యభీష్టము నెరవేర్ప వచ్చితి, కాన నీకేమి వరములు కావలయునో కోరుమనగా, అందులకు వాయువు, దేవా! నేనున్ను పరమాత్మవలె సకల జీవరాసుల హృదయము లందును, వెలుపలను సంచరించుచు, సర్వవ్యాపకుడనై యుండవలయుననియు, కైలాస శిఖరమున కర్పూరాకారలింగమై సమస్త దేవ, మానుష, రాక్షసాదులచే పూజింపబడుచుండవలయుననియు, ఈ లింగము తన నామముతోగూడిన వాయులింగమను పేరుతో భూలోకమున ప్రసిద్ధిజెందునట్లు వరమీయ శంకరుని ప్రార్థించెను. పరమేశ్వరు డా వరముల వాయుదేవున కొసంగి, తాను ఆ లింగము నందు లీనమయ్యెను. ఈ కారణముచేత శ్రీ కాళహస్తి ఈశ్వరునికి స్వయంభువాయులింగ మని పేరు వచ్చినది. ఇప్పటికిని మన పెద్దలు ఈ లింగమును శ్రీ కాళహస్తి స్వయంభువాయులింగమని చెప్పుచున్నారు.

## కన్నప్ప మోక్షము

ద్వాపరయుగాంతమున హస్తినాపురిలో నివసించియుండు పంచపాండవులలో మధ్యముడైన అర్జునుడు శత్రువుల జయింప పాశుపతాస్త్రమును బడయవలయునని, ఇంద్రనీల పర్వతమున

కేగి, శంకరునిగూర్చి ఘోరతపముచేయ ప్రారంభించెను. తదుపరి పాండవుల పరమశత్రువగు దుర్యోధనుడు, అర్జునుని చంపనెంచి మూకుండను రాక్షసుని పంపెను. వాడు ఇంద్రనీల పర్వతమును చేరి, వరాహ (పంది) రూపముదాల్చి, అర్జునుడు తపముచేయు స్థలమును పెకళింపసాగెను. ఈ యుదంతము దెలిసిన కైలాస నాథుడు వెంటనే పార్వతీ సమేతుండయి, కిరాతక వేషమును ధరించి, పందిని చంపబూని, దాని వెనువెంట బయలుదేరిరి. అంత నా వరాహము ఘోరముగ ఘురుఘురుమని బుసలుకొట్టుచు అర్జునుని తపస్సును భగ్నమొనర్చెను. అర్జును డాగ్రహావేశుడై తన తపమును భగ్నమొనరించిన యా పందినిజూచి, విల్లంబులు చేతబట్టి యా పందిని వెంటాడెను. ఆ వరాహము రోదనచేయుచు శంకరుని వద్దకురాగా, అర్జునుడు, శంకరుడు ఒకే కాలమున తమ తమ యస్త్రముల ప్రయోగించిరి. ఆ యస్త్రముల దెబ్బల కోర్వ లేక యా వరాహము నేలగూలి ప్రాణముల విడచెను. అప్పుడు పందిని చంపినది నేను, నేనని ఈశ్వరుడు, అర్జునుడు వాగ్వివాద ములు చేసికొనుచు, మల్లయుద్ధము చేయదొడంగిరి. మల్లయుద్ధ మున తన నాథునకు కలిగెడి కష్టమును పార్వతీదేవిచూచి, సహిం చలేక అర్జునునికి పార్వతీదేవి ప్రత్యక్షమయ్యెను. అర్జునుడు పార్వతీ పరమేశ్వరుల పాదములపైబడి సాష్టాంగ నమస్కార ములు చేయగా, శంకరుడు అర్జునుని గాంచి, భక్తా! నీ కేమి వరములు కావలయునో కోరుకొనుమని యడుగగా, అర్జునుడు స్వామి! నా శత్రువుల జయింప నీవద్దనుండు పాశుపతాస్త్రము గోరి తపమాచరించితి. కాన నా పాశుపతాస్త్రము దయచేయవలె

నని ప్రార్థించెను. దయామయుడగు శంకరుడు పాశుపతాస్త్రమును ప్రసాదించెను. వెంటనే పార్వతి పై వృత్తాంతమును ఈశ్వరునికి యెరిగింపగా, ఈశ్వరుడు ఓరీ! అర్జునా! నీవు మమ్ము నిందించితివి. కాన నీవు మరుజన్మలో (కలియుగమున) బోయకులమున బుట్టి, దక్షిణకైలాసమందు నా శివలింగమునకు పూజలుచేయుచు పందులను వేటాడి, వాటి మాంసమును దెచ్చి నైవేద్యము చేయుచుందువు. అటుపైన యా లింగమున నీకు దర్శనమిచ్చి, శాప విమోచనము గావించి, మోక్షమొసంగెదనని చెప్పి పార్వతీ పరమేశ్వరు లిరువురు అంతర్ధానమైరి. అటుతర్వాత అర్జునుడు పాశుపతము గైకొని శత్రువుల జయించెను.

## అర్జునుడు బోయవాడుగా పుట్టుట

కలియుగారంభమున కాళహస్తికి రెండు యోజనముల దూరమున ఉడుమూరను పురాతనమగు నగరమొకటిగలదు ఆ యూరు పర్వతములందు గలదు. అచ్చట విశేషముగా బోయలు కాపురముచేయుచున్నారు. వారు ఉదయమున లేచినది మొదలు పాపపుణ్యములు తెలియనివారై, అడవులకు వెళ్ళి పులులు, జింకలు, పందులు మొదలగువానిని వేటాడి, ఆ మాంసమును తినుచు జీవించుచుండిరి, ఆ బోయలు గ్రామపెద్దగా నాగన్న అనువానిని నియమించుకొని, వాని యాజ్ఞానుసారముగా నడచుకొనుచుండిరి. కొంతకాలమయిన పిదప నాగన్న పుత్రసంతానము లేకుండుటచే ఆ యూరిలో నొక దేవాలయమును నిర్మించి, అందొక శివదేవ

తను పెట్టి ప్రతిసంవత్సరము కొలువులు, పూజలు నాగయ్య అను నతను జరిపించుచుండెను. తరువాత ఆ దేవత ఒక సంవత్సరం తన పూజారిపై ఆవేశం జూపి ఓరీ భక్తా! నాగయ్యకు పుత్ర సంతానము లేనందున వాడు పూజలు జరుపుచున్నాడు అని దేవత పలికెను. అందులకు నాగయ్య అవును తల్లీ? మారెమ్మా! మాకు పుత్రసంతానము లేదు తల్లీ! అనుగ్రహించుము అని మారెమ్మను వేడగా అందులకు ఆమె ప్రత్యక్షమై భక్తా నీ పూజకు సమ్మతించి నీకు పుత్రసంతానము ఇచ్చెదను అని ఆ దేవత మాయ మయ్యెను. పై విధముగా కొన్ని సంవత్సరములు గడచిన తరు వాత ఒకనాడు ఉసపూరను గ్రామమునయందు నాగయ్య, అతను భార్య ఇద్దరుకలిసి వేటకుపోగా ఆ దినమంతయు తిరిగి తిరిగి వారికి ఒక జంతువైన చిక్కలేదేయని అలసి ఇంటికివచ్చి మరు నాడు ఉదయంలేచి ఆ పర్వతమునకుపోయి వేట ప్రారంభించెను. ఆనాడుకూడా వారికి వేట దొరకనందున చింతనొంది యా పర్వత ములోనే నివాసముచేయుచుండగా మరలా యొక దినం వేటకు పోయెను ఆనాడు ఒకజింక వారికంటబడినది, దానిని వారుచూచి తరుముకొనిపోగా ఆ జింక వారిని అడివియంతయు త్రిప్పిత్రిప్పి సాయంకాలానికి ఆ లేడి వారికి అగుపడకుండా మాయమయ్యెను. అప్పుడు నాగయ్య ఆ రాత్రి అక్కడనే పరుండి ఉదయమునలేచి భార్యను వెతక నారంభించెను. వెతకగా వెతకగా ఒక పెద్ద పర్వ తముక్రింద పెద్ద కొలను నాగయ్యకు అగుపడెను ఆ కొలనులో నుండి యేడ్పులు నాగయ్యకు వినవచ్చెను అదివిని తన భార్యయగు

అక్కడ ఉండునోయని తలంచి అలసి కొలనుదగ్గరకు వచ్చెను. ఆ కొలనుగట్టున ఒక మొగ శిశువు బోయనాగయ్యకు అగుపడగా ఈబిడ్డను ఈశ్వరుడే ప్రసాదించెను. అని స్వామినివేడుకొని శిశువును ముద్దాడి బిడ్డను యెత్తుకొని స్వామికి నమస్కారముచేసి భార్యను వెతకవలయునని అడవిలో అరచుచు తన వూరుకి వస్తూయుండగా తన భార్యయగు బడలికచేత పరుండుటచూచి ఆనందమును జెంది తానుతెచ్చిన శిశువును, భార్యకుచూపి సంతోషముజెంది వారిరువురు ఆనందముతో ఆ పర్వతమునుండి తమ ఉకుపూరను గ్రామమునకు మరుసటిరోజున సావకాశముగా తనయిల్లుచేరినారు. మరుసటిరోజున అడవిలోదొరికిన మగశిశువును ఆ ఊరి గ్రామదేవతవద్దవుంచి తమతమ బంధువులను రప్పించి ఆనందముతో మారెమ్మకు కొలువులు, మేకలు నరికి, పొంగళ్ళుపెట్టి ఆనందము జేయగా, వీరిపూజలకుమెచ్చి మారెమ్మ ప్రత్యక్షమై భక్తాగ్రేశరుడగు నాగయ్యకు దర్శనమిచ్చి భక్తా! నీకు దొరికిన మగబిడ్డకు నామకరనం తిన్నడు అని నామధేయము పెట్టుమని అమ్మవారు పార్వతీదేవి కైలాసమునకు పోయెను. తరువాత ఇక్కడ వుండగల వారందరికి, నాగయ్య పండ్లు, ఫలహారములు పంచిపెట్టి ఇక మీదట మనకు దొరికినబిడ్డయే మనకందరికి పెద్దగా పెట్టుకోవలయునని, వారందరు నిర్నయించి యాబిడ్డ తిన్నడు అని నామధేయమునొసగి అందరుకలసి తమగృహామునకు వచ్చిరి ఆనాటి నుండి వారందరు భక్తిమార్గములతో స్వామిని సేవింపుచు కాలము గడుపుచుండెను. ఇట్లు పై విధముగా బోయలకు యాకన్నప్పయని

నతడు అడవిలో దొరికెను: అరణ్యమేది అనగా అదియే కైలాస గిరి పర్వతముఅని ఇప్పుడు పెద్దలు చెప్పుచున్నారు.

ఈ విధముగా తిన్నడు శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడై తనతోటి పిల్లలతో యాడుకొనుచుండెను. కొన్ని దినములు గడచిన పిమ్మట నాగయ్య తిన్ననికి విలువిద్యలు నేర్పి, విలువిద్యయందు గొప్ప నిపుణుని గావించెను. తిన్నడు తనతోడి బాలురతో అరణ్యమున కేగి వేటాడి, ఇంటికి తిరిగివచ్చుచుండెను. ఇట్లు కొంతకాలమయిన వెనుక యా బోయగూడెమువారు తిన్నని తమ నాయకునిగా చేసికొనిరి. ప్రతి దినము వేటకు వెళ్ళునపుడు తిన్నడు తన తలిదండ్రులవద్ద అనుమతిపొంది పోవుచుండెను. ఒకనాడు తానొక్కడే వేటకు వెళ్ళవలయునని తలంచి, తనతండ్రి నడుగగా, నాగయ్య అందులకు సమ్మతించలేదు. మరునాడు తన తల్లినికూడ యడిగెను. కాని ఆమెయు అందులకు అసమ్మతిని చూపెను. తిన్నడు పట్టుదలతో తలిదండ్రులను గట్టిగా అడుగగా, వారు సమ్మతించి, మంచిముహూర్తమును జూచి, తిన్నని ఆశీర్వదించి పంపిరి. తిన్నడు విల్లనంబులు చేతబూని, పాదములకు జోడు, వుత్తరజందెము, కంఠమాల, కవచములను ధరించి, వేటకుక్క సహాయముతో కైలాసగిరి పర్వతారణ్య ప్రాంతమును జేరి, అందగుపడిన జంతువుల వేటాడుచు, సాయంకాలమగుసరికి అలసటజెంది, ఒక వటవృక్షముక్రింద నిదురించెను. తర్వాత ఈశ్వరుడు తిన్ననికి కలయందు కనబడి, భక్తా! కైలాసగిరి పర్వతమున నొక వటవృక్షముక్రింద శివలింగ మొకటి యున్నది.

నీవు ఆ లింగమును పూజించుచు మోక్షము నొందుమని జెప్పి ఈశ్వరుడు అంతర్ధానమయ్యెను. తిన్నడు పరమానందముతో లేచి ఇటునటు చూడగా ఒక పంది పోవుచుండెను. దానిని వెంటాడుచు పోగా, ఆ పంది వానిని కైలాసపర్వతమునకు మూడు ప్రదక్షిణములు జేయించి, అయాసము కలుగునంతవరకు పర్వతములలో త్రిప్పి, సాయంకాలమగుసరికి పొదలయందు ప్రవేశించి, కడకు కైలాస పర్వతముననుండు అఖండ బిల్వవృక్షమువద్దకు వచ్చి ఆ పంది మాయమయ్యెను. అప్పుడు తిన్నడు ఆ పంది యెటు పోయెనదో యని వెదకుచు వచ్చి, యచ్చట ఒక పొదలో యున్న శివలింగమును గాంచెను. తిన్నడు తాను జెందిన శ్రమయంతటిని మరచి, మిక్కిలి సంతోషముతో, ఆ శివలింగమును సమీపించి, స్వామీ! యీ ఘోరారణ్యమున మీరు ఒంటరిగా నివసించుటకు కారణ మేమి? యని యడుగుచు, యా శివలింగమును ఆలింగనము జేసికొనెను. తిన్న డా లింగమును తాకినంతమాత్రముననే పూర్వజన్మ వృత్తాంతమును గ్రహించినవాడయి, మహదానందముతో నా శివలింగమునకు పూజలుచేయ నిశ్చయించెను. మరునాడు తిన్నడు ఉదయముననే లేచి, కాలకృత్యముల దీర్చికొని, సువర్ణముఖీనదియందు స్నానముజేసి, నోటియందు జలమునుంచుకొని, చేత విల్లంబులు బూని, యా లింగముకడకు వచ్చి, తన నోటిలోని నీటితో అభిషేకముజేయ నారంభించెను. ఇటులనే ప్రతినిత్యము పందులను, జింకలను వేటాడి, వాటి మాంసమును తానే వంటజేసి, వాటిని రుచిజూచి, బాగుగనుండెడి కూరను స్వామికి నైవేద్యముజేసి, యాలింగము దాపుననే పరుండి నిద్రించుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచినది. తిన్నని కొరకు వాని తలి దండ్రులు భయాక్రాంతులయి దుఃఖించుచు. వాని రాకకై నిరీ క్షించుచుండి, తిన్నని జాడదెలియక వానిని వెదకుటకుగాను వాని తలిదండ్రులు, ఆ గ్రామములోని కొందరు పెద్దలు, స్నేహి తులు బయలుదేరి అడవులందు వెదకుచు. కైలాస పర్వత ప్రాంత ముల జేరి, యచ్చటనూ వెదకి, వెదకి తుదకు యా శివలింగము నకు పూజలు చేయుచున్న తిన్నని గాంచిరి. తల్లిదండ్రులు, స్నేహితులు, పెద్దలు యందరును పలువిధముల పిలచినను పలుక డయ్యెను ఆ శివలింగమును ఆలింగనము చేసికొనుచు అచ్చటనే పరుండెను. తిన్నడి తల్లి లింగము దగ్గరకు వెళ్ళి, కుమారా! నేను తల్లిని. అదిగో మీ తండ్రి, స్నేహితులు. నాయనా! మమ్ముల నందరిని యిటులేల శోకసముద్రమున ముంచెదవు? రమ్ము. మన యూరికి పోదము యని పెక్కువిధముల బ్రతిమాలెను. గాని తిన్నడు మాత్రము ఈ ప్రపంచముతో సంబధము లేనివానివలె యూరకనుండెను. నాగన్నయు తిన్నని పలుకరించుటకు పలువిధ ముల ప్రయత్నించెను. కాని యా తిన్నడు శివధ్యానమునందు మునిగియుండుటచే, యెవ్వరెన్నిమార్లు పిలచినను పలుకకుండెను. ఈ దృశ్యమును గాంచిన ప్రతియొక్కరు గొల్లున యేడ్వసాగిరి. వీరి రోదన శబ్దములకు తిన్నడు దిగ్గునలేచి, అచ్చోటికి వచ్చిన వారినందరిని గాంచి, మెల్లగా తన తల్లివద్దకు వచ్చి, కౌగలించు కొని, అమ్మా! మీరిచ్చటికి వచ్చిన కారణ మేమి?' యని అడి గెను అందరు కామె వగచుచు జరిగిన వృత్తాంత మంతటిని చెప్పగా, తిన్నడు తల్లిని సమాధానపరచి, యూరికి వెళ్ళిరండని

చెప్పి, మర్ల యా శివలింగమును కౌగలించుకొనెను. వచ్చిన వారందరు దిగులునొంది తిన్నని పిలువసాగిరి. ఇట్లు కొన్ని దినములు గడచిన పిమ్మట నిస్పృహజెంది తమ తమ గృహములకు వెళ్ళిరి.

తిన్నని తలిదండ్రులు మిక్కిలి వ్యసనముతో గ్రామదేవత వద్దకు వెళ్ళి, తల్లీ ! నీవు ప్రసాదించిన మా శిశువును మాకు దూరము జేయుట న్యాయమా ? మేము జేసిన పాప మెట్టిది ? యని విలపింపసాగిరి. పుత్రశోకముచే నిట్లు కుమిలి, కృశించుట కంటెను నా ప్రాణముల నీకే యర్పింతునని, నాగన్న యచ్చటనే యుండిపోసాగెను. కొన్ని దినంబులకు ఆ మారెమ్మ దేవత నాగన్నకు స్వప్నమున కనబడి, తిన్నని పూర్వజన్మ వృత్తాంతము నంతయు చెప్పెను. నాగన్న నిద్రనుండి మేల్కొని, దేవతకు ప్రదక్షిణ నమస్కారముల జేసి, యీ విషయముల తన భార్యకు తెలియజేయవలయునని ఆతురతతో యింటికి వచ్చెను. తన భార్య తిన్ననిగురించి దుఃఖించుచు, నేను నా బిడ్డనువదలి యుండలేను, నేనుగూడ నా పుత్రునితో నచ్చటనే యుందునని జెప్పుచు బయలు దేరెను. నాగన్న తన భార్యను సమాధానపరచి, మారెమ్మ దేవత తనకు స్వప్నమున చెప్పిన విషయమంతయు తన భార్యకుచెప్పెను. అప్పుడామె విచారమును వదలి, తన పుత్రునిపైగల ఆశలన్నియు విడచి, గ్రామదేవతవద్దకు వచ్చి, తల్లీ ! జగన్మాతా ! మేము గావించిన తప్పులన్నియు క్షమించి, మమ్ము కరుణించి ఇకనైన మాకు పుత్రభిక్ష నొసంగుము. తల్లీ! నీకు దేవాలయమునుకట్టించి,

ప్రతిసంవత్సరము పూజలు, కొలువులు చేసి, పొంగళ్ళు పెట్టెద మని వేడుకొని గృహమునకు వెళ్ళిరి.

మరుదినం తిన్నడు యధాప్రకారం స్వామికి పూజచేయుటకు మొదలెట్టెను. ఇట్లు కొంతకాలము జరుగుచుయుండగా తరువాత దక్షణకైలాసమునకు సమీపమున దేవునిపురం అను నొక గ్రామముగలదు అందు నివసించియుండు పరమభక్త శిఖామణి యగు శివగోచరి అను బ్రాహ్మణుడు కైలాసపర్వతముపోయుండు లింగమును గని పూజచేయదలంచి ఒకదినము ఉదయమునలేచి స్వర్ణముఖీనదిలో స్నానముచేసి పరిశుభ్రముతో జలము, పుష్పములు తెచ్చి యాలింగమును శుభ్రపరచి జలముతోఅభిషేకముచేసి పుష్పములు పెట్టి పూజించి పోవుచుండెను. ఇట్లు జరుగుతుండగా తిన్నడు వచ్చి ఈ శివగోచరి బ్రాహ్మణుడు చేసినపూజలనుగని కోపించి నా స్వామిమీద యెవడోదుర్మార్గుడు ఆకులలములు పెట్టి పోయెనేయని తిన్నడు అవిఅన్నిదూరముగాపారవేసి తానునోటితో తెచ్చిన జలముతో అభిషేకముచేసి పందిమాంసములను స్వామికి నైవేద్యము పెట్టిపోయెను. మరుదినం ఉదయం శివగోచరి అను బ్రాహ్మణుడు స్నానముచేసి అభిషేక సామగ్రులను చేతబట్టి తీసుకొని యాలింగమువద్దకురాగా ఈలింగముమీద మాంసములను చూచి యతికోపముజెంది యెవడో దుర్మార్గుడు మాంసము స్వామి మీద పెట్టిపోయెనే అని వాడిని నీచముగామాటలాడి దుఃఖించి అవినన్నిటిని తోసివేసి తానుతెచ్చిన పూజసామగ్రులను స్వామికి అభిషేకముచేసి వెడలిపోయెను. మరుదినం తిన్నడువచ్చి ఆలింగ

మును గని అయ్యో స్వామికి ఇష్టములేనిపని చేసినాడే స్వామికి నెత్తిన ఆకులలములు పెట్టిన దుర్మార్గుడెవడు అని కోపముచేత అవియన్నియు దూరముగా పారవేసి తానుతెచ్చిన మాంసములు స్వామికిపెట్టి నైవేద్యముచేసి వెడలిపోయెను.

మరుదినం శివగోచరి అను బ్రాహ్మణుడు అభిషేక ద్రవ్యములను చేతపట్టుకొని లింగమును సమీపించి అయ్యో అయ్యో స్వామికి మాంసములు ఈదినంకూడా పెట్టియున్నారేఅని బ్రాహ్మణుడు దుఃఖించుచు ఈ అపచారములు నీవు యెట్లు భరించెదవు స్వామి మాంసములు నీకు పనికిరావే నీవు సహించలేవే ఇట్టి పాపకార్యములను చేయువాడిని దండించకూడదా శిక్షించరాదాయని స్వామిపాదములక్రింద బ్రాహ్మణుడు తల పగులగొట్టుటకు సమ్మతించి ప్రార్థనలుచేసి స్వామిపాదములకు శిరస్సును మోదుచుండగా రక్తముకారుచుండెను అప్పుడు లింగమువెనుక శబ్దము వినవచ్చెను. ఆ శబ్దము యేమియనగా భక్తా మాంసములు పెట్టినవాడు నీకుమించిన భక్తుడే వాడు సామాన్యుడు కాడు సుమా వాని భక్తి నీవు చూడదలచిన రేపటిదినము నీవువచ్చి మరుగై యుండి వానిభక్తి పరీక్షింపుము అని పలికెను. వెంటనేలేచి స్వామికి నమస్కరించి వెడలిపోయి మరుదినం తెల్లవారుజామున లేచి స్నానపానములుచేసుకొని శివలింగమువెనుక దాగియుండెను. తదుపరి తిన్నడు మాంసములను, నోటిలో జలమునుతీసుకొనివచ్చి స్వామినిచూడగా ఆదినము స్వామికి కంటినుండి రక్తము కారుచుండుటచూచి పట్టరాని ఆవేశముతో వనమూలిల వెతకిన ఎవ

రున్ను అగుపడలేదు. వెంటనేపోయి వనమూలికలు తెచ్చిపోసినా, స్వామి కంటినుండి రక్తముకారుట నిలువలేదు. మరలాపోయి ఆ పర్వతములో యెన్నివనమూలికలున్నవో అన్నియును తెచ్చి పోసినా రక్తము నిలువలేదేయని అని దుఃఖించి దుఃఖించి ఆఖరకు ఆకులలుములు తెచ్చి కట్టినా వాటికిన్ని రక్తముకారుట నిలువలేదు అయ్యోస్వామి ఇంక నేనుమాత్రం యేమిచేయను అని ఆలోచించి ఆలోచించి ఒక వుపాయముతట్టి మందులు మాకులు పనికిరావని తలచి కడకు మనస్సునకు మనస్సు, కంటికి కన్ను అని తలచి తన కన్నును స్వామికి పెట్టుటకు సమ్మతించెను. అపుడు తిన్నడు స్వామిని వేడుకొని శంకరా దయామయా నీలకంఠా లోకరక్షకా నామొర ఆలకించి నా కంటితో నీ కంటి రక్తము నిలిపి యథా రీతిగా నీ నేత్రము వచ్చులాగున చేసుకోస్వామి అని ప్రార్థించి తన చేతిలోయుండు అంబును తీసుకొని తన కన్నును వూడతీసి స్వామి నేత్రమునకు అతికించెను. వెంటనే స్వామి నేత్రమున నుండి రక్తము నిలచిపోయినది. అని పరమ సంతోషముతో తానుతెచ్చిన మాంసమును ఈశ్వరునికి ఆరాధనచేసి నమస్కరించి వెడలిపోయెను. తిన్నడు పోయినతరువాత లింగమువెనుక దాగియుండిన శివగోచరి అను బ్రాహ్మణుడు తిన్నడు భక్తి మెచ్చుకొని స్వామికి నమస్కరించి వెడలిపోయి మరుదినం ఉదయంలేచి స్నానపానములుచేసి పూజ ద్రవ్యములను తీసుకొని వచ్చి లింగమునకు అభిషేకముచేసి పుష్పములు నలంకరించి ప్రార్థనచేసి లింగము వెనుకల దాగియుండెను. తరువాత తిన్నడు

స్వర్ణముఖినదిలో స్నానముచేసి నోటితో తీర్థము అస్త్రములతో తీసుకొని శివలింగమువద్దజేరి స్వామినిచూడగా మరలా రెండో కన్నునుండి రక్తము కారుచుండెను తిన్నడు అదిచూచి ఈ దినం కూడా రెండవ నేత్రమునుండి రక్తముకారుచున్నదే ఈ పని యే దుర్మార్గుడు చేసియుండును అని తలంచి స్వామీ! వారిని దండించకూడదా? దేవదేవా కరుణామయా ఇక నేను యేమిచేయుదును నా స్వామికి నేత్రమునుండి రక్తముకారుచున్నదేఅని చింత నొంది మీకులేనికన్ను నాకు వుండీప్రయోజనములేదు అని తన కున్న రెండోకన్నుని స్వామికి పెట్టవలయునని తలచి తన చేత యున్న బాణమునుతీసి తనకన్ను పెరకబోగా మన కన్ను తీసిన తర్వాత నాకు సూపు అగపడదే యేమిసేయుదును అని తిన్నడు యోచించి తన చెప్పుకాలునుయెత్తి స్వామికంటికి నేరుగాపెట్టి గురుతుకు తనచొప్పుకాలును శివలింగముమీదపెట్టి స్వామికి తన రెండోకన్నును తీసియిచ్చుటకు సమ్మతించి శంభో శంకరా లోక రక్షకా గిరీశా మహీశా దేవదేవా యని ప్రార్థనచేసిన తరువాత తన రెండోకన్నును బాణముచేత పెళ్ళగించెను. అప్పుడు శంకరుడు ప్రత్యక్షమై భక్తా నీభక్తికి మెచ్చితిని నీకు యేవరముకావలయునో అడుగుము అనగా వెంటనే తిన్నడు స్వామికి నమస్కారములు చేసి ఈనాటికి మీకు నామీద కరుణకలిగెనా స్వామీ అని వేడు కొనిన తరువాత తిన్నడు స్వామీ మొదటి పూజలు నావి, రెండో పూజలుమీవి నా నామధేయము కలియుగమున ప్రసిద్ధిజెందవలయు ననీ తిన్నడు కోరగా శంకరుడు సంతోషించి అప్పటినుండి తనకు కన్నుయిచ్చినందులకు భక్త కన్నప్పనయనార్అని నామధేయము

నొసగి కలియుగములో భక్తులు నిన్ను పూజింతురుగాకయని శంకరుడు భక్త కన్నప్పకు శాప విమోచనంచేసి మోక్షమును ప్రసాదించెను. అప్పటినుండి ఈశ్వరుని భక్తుడు కన్నప్పయని నామధేయము పుట్టెను ఈ విధముగా ఈశ్వరుడు కన్నప్పకు వరములిచ్చి మాయమయ్యెను. ఆ నాటినుండి ఈ క్షేత్రములో స్వామివారికి బ్రహ్మోత్సవము జరుగును. అవి జరుగునప్పుడు భక్త కన్నప్ప మొదలుపూజలు చేయుదురు. తరువాత స్వామివారికి జరుపబడును. ఈ విధముగా జంగమ వేషముననున్న పరమేశ్వరుడు చెప్పెనవి నైశారణ్య వాసులగు శౌనకాది మహర్షులకు సూతుడు శ్రీ కాళహస్తి క్షేత్రమహాత్మమునుచెప్పి ముగించెను.

ఓంశాంతిః ఓంశాంతిః ఓంశాంతిః

శుభం శుభం శుభం.



ఈ క్షేత్రములోయుండు తీర్థములు ముఖ్యమైనవి.

| | |
|---|---|
| 1 మార్కండేయ తీర్థము | 6 వేద తీర్థము |
| 2 నీలకంఠ తీర్థము | 7 చక్ర తీర్థము |
| 3 భరద్వాజ తీర్థము | 8 మునికర్ణిక తీర్థము |
| 4 సూర్యపుష్కరణి తీర్థము | 9 రామ తీర్థము |
| 5 చంద్ర తీర్థము | 10 సహస్ర తీర్థము |



శ్రీ కాళహస్తీశ్వరస్వామినే నమః

## శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరస్వామివారి దేవాలయములో కట్నములు, రుసుముల వివరములు.

| | రూ. | నపై. | | రూ. | నపై. |
|---|---|---|---|---|---|
| ప్రవేశ రుసుము | 0 | 13 | పంచామృతాభిషేకము | 25 | 00 |
| టెంకాయ, హారతి | 0 | 08 | సహస్రనామార్చన | 17 | 00 |
| అష్టోత్తరనామార్చన | 0 | 33 | నిత్యదిట్టము | 12 | 00 |
| పిల్లలకు ప్రవేశము | 0 | 06 | త్రిశతి అర్చన | 12 | 00 |
| వస్త్ర కట్నము | 1 | 00 | ప్రదోష నంది సేవ | 12 | 00 |
| ళిగ కట్నము | 1 | 00 | నిత్య ఉత్సవము | 10 | 00 |
| కాశి గంగాభిషేకము | 2 | 00 | అంబారి ఉత్సవము | 25 | 00 |
| పచ్చకర్పూరాభిషేకము | 6 | 00 | ఏకాదశి రుద్రాభిషేకం | 36 | 00 |
| పాలాభిషేకము | 3 | 00 | నంది సేవ ఉత్సవం | 108 | 00 |

పై కనుబరచియుండు ఉత్సవముల రేట్లు, కట్నములు వగైరాలు సమయానుకూలముగా కాలపరిస్థితులనుబట్టి మార్పు చేయబడుచుండును.



ఆనందా ప్రింటర్స్, తిరుపతి. కా. 1000.